Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యుం II.] 1942 వ సం॥ మే నెల 29 వ తేది శుక్రవారం [నె 21 రు.

## లెండు ! భారత వీరులారా ! లెండు !

## జాతీయ యుద్ధరంగములో చేరండి !

### మద్రాసు గవర్నరుగారి యుపన్యాసము.

మద్రాసులో జాతీయ యుద్ధరంగమును ప్రారంభించుచు మద్రాసు గవర్నరుగారైన సర్ ఆర్థరు హోపు గారిట్లు చెప్పిరి :—

మన వైస్రాయిగారు చెప్పిన రీతిగా యీ జాతీయ యుద్ధరంగం అనేది యావద్భారత దేశానికి సంబంధించిన విషయమైయున్నది. ఈ దేశ క్షేమమును కోరేటటువంటి సహృదయులందరూ యీ జాతీయ యుద్ధరంగములో చేరవచ్చును. భారతదేశపు సరిహద్దులవద్దకు శత్రువులు వచ్చియున్నారు. జపానువారివల్లను, జర్మను నాజీలవల్లను భారతదేశమునకు కలిగే ఉపద్రవమునుండి భారతదేశమును రక్షించుటకు యీ ఆపత్సమయములో మనమందరము ఒక్కటే సంకల్పంతో పనిచేయవలెను. అట్టి స్థిరసంకల్పంతో అట్టి సమ సంకల్పంతో పనిచేసే వారందరూ యీ జాతీయ యుద్ధరంగములో చేరవచ్చును.

భారత దేశములోని ఇతర రాజకీయ పక్షములతో పోటీచేసి, ఇతర పార్టీలను ఎదిరించుటకు యీ జాతీయ యుద్ధరంగం అనేది ఏర్పడలేదు. హిందువుగాని, మహమ్మదీయుడుగాని, బ్రాహ్మణుడుగాని, బ్రాహ్మణేతరుడుగాని, ఆంగ్లేయుడుగాని, భారతీయుడుగాని, ఎవరైననుసరే, కులభేదములను మత భేదములను పాటించక, అందరూ ఏకమై మన గుమ్మమువద్దకు వచ్చిన శత్రువును వెలుపలకు వెళ్లగొట్టవలెను. దేశభక్తులందరున్నూ, ఏ పార్టీవారైనను సరే, ఇందుకు తోడ్పడి సహాయముచేయవలెను. ఈ ప్రయత్నంలో నాతో కలిసి పనిచేయుటకు, తమిళనాడు ప్రతినిధులు, ఆంధ్రరాష్ట్ర ప్రతినిధులు, పశ్చిమ కోస్తా ప్రతినిధులు, యీ సభకు వచ్చియున్నారు. ఇంతవరకు వీరు రాజకీయ రంగములలో ఏకీభవించినవారుకారు. కాని, ఇప్పుడు శత్రువును జయించవలెననే విజయకాంక్షతో, తమ దేశము యెడల వారికిగల అభిమానముతో ఇప్పుడు యీ ప్రజా ప్రతినిధులందరూ, ఏకముఖముగా యిచట సమావేశమైనారు.

#### జాతీయ యుద్ధరంగముయొక్క ఉద్దేశములు.

శత్రువు దేశములోనికి వచ్చినప్పుడు శత్రువును ధిక్కరించుటకు ప్రజలందరూ సంసిద్ధంగా ఉండేటట్లు చెయ్యాలి. శత్రువును ఎదిరించుటకు యిష్టములేనివాళ్లను తొలగించుటకు ప్రయత్నం చెయ్యాలి. దేశ విద్రోహ చర్యలను అణచి వెయ్యాలి. మాటలలోగాని, వ్రాతలలోగాని, నీలి వార్తలను వ్యాపింప జెయ్యకూడదు. ఇతరులు అట్టి వార్తలను వ్యాపింప జెయ్యకుండా అరికట్టవలెను. ప్రజలలో ధైర్య సాహసములను, ఓర్పును పెంపొందించి శత్రువును తుదముట్టించుటకు ప్రజలందరూ తోడ్పడేటట్లు చేయవలెను.

బయటనుంచి వచ్చేటటువంటి శత్రువును ఎదిరించవలెను. అంతేకాకుండా దేశంలో అంతఃకలహములుగాని, ప్రజా సంక్షోభములుగాని రాకుండా తగిన ప్రయత్నములను కట్టుదిట్టంగా చేయవలెను. ఇట్టి ప్రయత్నమును నిరుత్సాహపరచే వారి సంకల్పమును సాగనీయకుండా అణచివేయవలెను. అంతేకాదు. ప్రజలలో విజయకాంక్షను రెండింతలుగా వృద్ధిచేయవలెను. మన శత్రువు

లైన జపాను, జర్మనీ, ఇటలీ రాజ్యాలు నిరంకుశ ప్రభుత్వాధికారం చలాయించే రాజ్యాలు. అవి అక్ష రాజ్యాలనే పేరుతో వ్యవహరించుచున్నవి. అటువంటి నిరంకుశాధికారం చలాయించే అక్ష రాజ్యాలను ఓడించుటకై తోడ్పడి సహాయం చెయ్యడం, భారతదేశములోని ప్రతి దేశభక్తుని యొక్క విధియైయున్నది. ఈ విషయమును ప్రజలందరికీ తెలియజెప్పవలెను. ఈ విధంగా సంకల్పించి పనిచేసే వారందరూ మన మిత్రుల నిన్నీ, మన సహచరులనిన్నీ మనము భావించి కలిసి పనిచెయ్యాలి.

ఇది అనధికార సంస్థ.

జాతీయ యుద్ధరంగం అనేది అధికారుల ప్రోత్సాహమువల్ల పనిచేసినప్పటికిన్నీ చాలావర కు, అనధికారులకు సంబంధించినదై యున్నది. ఈ ఉద్యమంలో చేరినవారు తమ రాజకీయ సంబంధమైన పార్టీ వ్యవహారములను, విభేదముల ను ఇందులోనికి తీసికొనిరాకూడదు. స్వలాభాపేక్ష లతో యీ ఉద్యమములో ఎవరున్నూ పనిచెయ్య కూడదు. దేశ క్షేమమును, దేశ గౌరవమును ప్రధానవిషయంగా భావించి, మనస్ఫూర్తిగా తమ కాలమునంతను వినియోగించి పనిచేయువారే యీ యుద్యమానికి నాయకత్వంవహించి పనిచెయ్యాలి. యుద్ధరంగమునుగూర్చి సరియైన వార్తలను ప్రచారంచేయగల స్త్రీలు పురుషులు, వేలకొలదిగా కావలసియున్నారు. విమానదళములలోను, నౌకాదళములలోను, పౌరరక్షణ దళములలోను, చేరవలసినదిగా జనాన్ని ప్రోత్సాహించవలసియు న్నది. సైనికులైనా సరే, వర్తకులైనా సరే, ప్రభుత్వోద్యోగులైనా సరే, విద్యార్థులైనా సరే, కార్మికులైనా సరే, యెవరైనను సరే, యీ జాతీ య యుద్ధరంగంలో చేరకుండా, దీనికి విము ఖంగా తొలగియుండవలసిన అవసరములేదు. ప్రజలలో యుద్ధాసక్తిని, ఐకమత్యమును కలి గించవలెను. మనకందరకు ప్రియతమమైన దానిని మనము రక్షించుకొనే నిమిత్తమై, మన శత్రువులను ఎదిరించుటకై మన యావచ్ఛక్తిని వినియోగించవలెను. అందుకొరకై నేను యీ మద్రాసు రాష్ట్రములో ఈ జాతీయ యుద్ధరంగ మునకు ముందుగా నిలువబడినాను. భారత దేశ మునకు విజయము సాధించండి. లెండు! భారత వీరులారా! లెండు!

---

# బ్రిటిష్ సామ్రాజ్యం — భారతదేశం.

గత ఆదివారమునాడు బ్రిటిష్ సామ్రాజ్య సంస్థాపనదినోత్సవ సందర్భములో ఇండియా కార్యదర్శియైన అమెరీగారు రేడియోద్వారా ఉప న్యసించుచు ఇట్లు చెప్పిరి :—

బ్రిటిష్ సామ్రాజ్యంలోచేరిన యితర రాజ్యా లతోబాటు భారతదేశం సరిసమానమైన స్వాతం త్ర్యమును గౌరవమును పొందవలెను. ఇదే మా నిశ్చయం. ఈ నిశ్చయం ఎంతమాత్రము తగ్గలేదు. మానవుడు సంకల్పించి సాగించెడి ఏ పనిలోనైనా లోపములుండక తప్పదు. బ్రిటిష్ సామ్రాజ్యంకూడా మానవ కల్పిత సంస్థయగుట వల్ల దానిలోకూడా లోపములుండక మానవు. కాని, ప్రపంచములోకెల్ల, యీ బ్రిటిష్ సామ్రా జ్యమొక్కటే న్యాయమును, ప్రజా స్వాతంత్ర్య మును రక్షించుచున్నట్టి సంస్థయని గ్రహించ వలెను. ఇది చాలా అపూర్వమైన సంస్థయని నా నమ్మకము. బ్రిటిష్ సామ్రాజ్యములోని రాజ్యము లన్నియు ఏకముఖముగా యీ కష్ట సమయంలో నిలువబడియున్నవి. ఈ విష యమే మనకు ఉత్సాహమును బలమును కలుగ జేయగలదు. బర్మా అధికారులు తమ విధిని నిర్వర్తించారు. ప్రజలలో అధిక సంఖ్యాకులు రాజభక్తి తత్పరులై యుండిరి. కాని, శత్రు వులు దండెత్తిరాగానే వారు నిస్సహాయులైరి. ఆ దేశములోనివారిని యుద్ధమునకు అదివరకు తయారుచేసియుండలేదు. మన బ్రిటిష్ నౌకా దళము ఆ దేశమును రక్షించి శాంతిని కాపాడు ననుకొంటిమి. కాని, ఆ ఊహ తప్పయినది. బ్రిటిష్ సామ్రాజ్యములో యీ లోపము జరిగి నను ప్రజలలో రాజభక్తి విశ్వాసములు తగ్గ లేదు. అందుకు కారణ మేమనగా, బ్రిటిష్ సామ్రాజ్యము ప్రజా స్వాతంత్ర్య దీక్ష గలది.

# 1942 వ సం॥లో యుద్ధం తీవ్రమౌతుంది.

బ్రిటిష్ దక్షిణాఫ్రికా యూనియను ప్రభుత్వపు ప్రధాన మంత్రియగు ఫీల్డు మార్షలు స్మట్సుగారు స్వాతంత్ర్యదీక్షాదళోత్సవమునాడు యీ క్రింది విషయములు చెప్పిరి :—

జపానుకు అదృష్టవశాత్తుగా ఎంతవరకు లాభించవలెనో, అంతవరకు లాభించింది. ఇక, జపానుకు గల నిజమైన యోగ్యతా సామర్థ్యము బయటపడవలసి యున్నది. రష్యాయున్నూ, అమెరికాయున్నూ రెండు బ్రహ్మాండమైన రాజ్యాలు మన పక్షమున చేరినవి. ఇవి జపానుకు జవాబు చెప్పగలవు. అంతేకాదు. యుద్ధానికి కావలసిన ఆయుధ సాధన సామగ్రులను తయారు చేయడంలో క్రిందటి సంవత్సరముకంటె యీ సంవత్సరం ఎక్కువ వృద్ధిలోనికి వచ్చియున్నాము. మన సేనలను ఎక్కువగా తర్ఫీయతుచేసి ఎక్కువ సైనిక బలమును సమకూర్చుకొని యున్నాము.

ఈ 1942 వ సం॥లో చాలా దారుణమైన ఘోరయుద్ధము జరుగనున్నది. ఈ మహా సంగ్రామంలో యీ సంవత్సరం జరిగే యుద్ధమే అత్యంత భీకరమైనది. ఆఫ్రికాలోకూడా, యుద్ధము విస్తరించగలదు. కాని, ఈ మహా సంగ్రామ గాథ ఆకస్మికంగా అడ్డం తిరుగుతుంది. ఎటువైపునుంచి ఎట్లా కథ అడ్డం తిరుగుతుందో నేను ఇప్పుడు చెప్పజాలను. కాని, యుద్ధకథావిధానం మారుతుంది. అప్పుడు యీ స్వాతంత్ర్యదీక్షా దళము కూడా విజయమును చేబట్టి విజయ పటాలముగా సిద్ధమవుతుంది.

---

# లిబియాలోని భారతీయ పటాలములు.

సర్ షాఫతు అహమ్మదు ఖానుగారు ఉత్తరాఫ్రికాలోని భారతీయ పటాలమును స్వయంగా చూచి బ్రిటిష్ దక్షిణాఫ్రికాకు వచ్చిరి. బ్రిటిష్ కాంగో రాజ్యానికికూడా వెళ్లిరి. బెల్జియను కాంగో రాజ్యానికికూడా వెళ్లి అచటి గవర్నరు జనరలుకు అతిధిగా ఉన్నారు. కాంగో నదిని దాటి స్వతంత్ర ఫ్రెంచి సేనానియగు గాలీగారికి ముఖ్యమైన ప్రధాన పీఠముగానున్న ఫ్రెంచి యీక్వెటోరియలు ఆఫ్రికాకు వెళ్లిరి. అచటి ఫ్రెంచి గవర్నరు జనరలు షాఫతు అహమ్మదు ఖానుగారికి స్వాగత మిచ్చెను. అహమ్మదు ఖానుగా రిట్లు చెప్పిరి :—

ఉత్తరాఫ్రికాలోని లిబియాలో ఉన్న జర్మను సేనలకంటె మన భారతీయ సైన్యములు చాలా ప్రశస్తముగా ఉన్నవి. అచటనున్న భారతీయ పటాలములకు నేను హిందూస్తానీలో ఉపన్యాస మిచ్చినాను. అచటి సేనలలోని చాలామంది ఉద్యోగులతో నేను కలిసికొని మాట్లాడినాను. వారందరూ మంచి ఉత్సాహంతో దివ్యమైన క్రమశిక్షణలో ఉన్నారు. లిబియాలోని దక్షిణాఫ్రికా పటాలములకున్నూ, అచటి భారతీయ పటాలములకున్నూ చక్కని అన్యోన్య స్నేహభావ మేర్పడినది.

---

# బర్మా యుద్ధ గాథ.

## వావెల్ సేనాని చెప్పిన విషయములు.

ఇంగ్లండులోని డెయిలీ టెలిగ్రాఫ్ అనే పత్రికయొక్క ప్రతినిధియగు మార్సులాండు గాండరుగారు బర్మా-అస్సాం సరిహద్దులవద్ద ఒక గుడిసెలో మకాము చేసియున్న జనరలు వావెలు గారిని (భారతదేశ సర్వసేనానిని) మే నెల 13 వ తేదిని సందర్శించి మాట్లాడెను. జనరలు వావెలు గారు బర్మా-అస్సాం సరిహద్దులవద్ద రోడ్డు ప్రక్కనున్న ఒక తడికల గుడిసెలో కూర్చుండి ముసురుచున్న దోమలను తోలుచు మాట్లాడిరి. వావెలుగారు ఇట్లు చెప్పిరి :—

రంగూను పడిపోయిన తర్వాత, సముద్ర మార్గంగా మన సేనలను సప్లయిలను బర్మాకు పంపుటకు వీలులేకపోయినది. లాషియోను జపానువారు ఆక్రమించుటవల్ల చైనాకు బర్మా

నుంచిపోయే మార్గమును జపానువారు అడ్డగించి నట్లయినది. అందువల్ల చైనాతో మనకు సంబంధం లేకుండా పోయింది. కాని, అట్లయి నప్పటికీ, బర్మాలోని మన బ్రిటిష్ సేనలు చాలా ధైర్యంగానే పోట్లాడినవి. మన సైనికులు కొన్ని నెలలనుంచిన్నీ విశ్రాంతి అనేది లేకుండా పోరాడుచుండిరి. వారికి సహాయార్థంగా క్రొత్త సేనలుకూడా పంపుటకు వీలులేకపోయింది. ఇది ఇట్లుండగా, బర్మావారిలోనే కొందరు మనకు ప్రతికూలురై మన సేనలను వెనుకనుంచి కొట్టడం ప్రారంభించారు. జపాను సైనికులు చిన్న చిన్న జట్లుగా విడిపోయి చాటుమాటుగా ముందుకు చొచ్చుకొని రావడంలోను, పర్వత ప్రాంతాలలో పోరాడుటలోను చాలా సమర్థులు. కాని, మనకు స్థానబలముగల చోట్ల ఇకముందు జపానువారితో సవాలుచేసి పోరాడగలం. పాములతోనిండిన అడవి మార్గములగుండా యిచటికి చేరినాము. బర్మానుంచి అస్సాముకు రోడ్డు ఒకటి తయారగు చున్నది. వేలకొలది కూలీలు ఇచట పనిచేయు చున్నారు. ఈ అరణ్యమార్గము జపానువారు బాంబులువేసి ధ్వంసం చేయుటకు వీలైనదికాదు. ఒక్కొక్కచోట యీ రోడ్డు 50 అడుగుల వెడల్పుగా ఉన్నది. తేయాకు తోటల ఆసాములు యీ రోడ్డు పనిని అజుమాయిషీ చేస్తున్నారు.

---

# అక్షరాజ్యాల అవ్యాజ కటాక్షం.

పూర్వ మొక పెద్ద పులి ఒక యేటిగట్టున కూర్చుండి, యేటికి ఆవలిగట్టున పోతున్నవాళ్లను పిలుస్తూ ఉండేది. "అయ్యా, ఇటువైపుచూడండి ! నేను ముసలిదానినైనాను. నా నోటిలోని దంతములన్నియు కదలిపోయినవి. నే నిదివరకు అనేక పాపములు చేసితిని. అందుకు ప్రాయశ్చిత్తముగా యీ బంగారు కడియములను దానము చేసికొని, పుణ్యము సంపాదించుకోవలెనని నిశ్చయించుకొన్నాను. నేను ముసలిదానినగుటవల్ల లేచి రాలేకుండా ఉన్నాను. కనుక నా వ్రతమును నేను పూర్తిగా నెరవేర్చుకొనుటకై, మీరు దయచేసి యీ యేటిలో స్నానముచేసి, శుచిగా నావద్దకు వచ్చి యీ బంగారు కంకణములను దానము పుచ్చుకొని నన్ను కృతార్థురాలినిగా చేయవలెనని ప్రార్థించుచున్నాను" అని పిలుస్తూ ఉండేది. ఒక రోజున ఒక అమాయిక బ్రాహ్మణుడు ఆవలిగట్టున పోతూ, యీ పెద్దపులియొక్క మాటలు విన్నాడు. దాని మాటలు నిజమని అనుకున్నాడు. బంగారు కడియములమీదకూడా ఆ పేద బ్రాహ్మడికి ఆశ కలిగింది. "సరే వస్తున్నాను, ఓ శార్దూలమా !" అనిచెప్పి ఆ యేటిలో స్నానం చేయవలెనని దిగాడు. కాని, ఆ యేటిలోని బురదలో కదలలేక దిగబడినాడు. ఆ ఊబిలో చిక్కుకొనియున్న బ్రాహ్మణుడు, "ఓ పుణ్యమూర్తీ ! ఓ శార్దూల చక్రవర్తీ ! ఇందులో నుంచి బయటకు రాలేకుండా ఉన్నాను. కనుక దయచేసి నాకు చేయూతయిచ్చి పైకి తీయవలెను" అని ఆ పెద్దపులితో మొరపెట్టుకున్నాడు. "అయ్యో ! పాపం ! ఎటువంటి దురవస్థ ప్రాప్తించింది ! ఇదిగో వస్తున్నాను ! భయపడకు !" అని ఆ వ్యాఘ్రం ఆ బ్రాహ్మణుని పై జాలిదలచి, చెంతకువచ్చి, తన కోరిక ఫలించినదని సంతసించి, కరచిపట్టి, మెడవిరిచి, కడుపార భక్షించింది.

అటువంటి వ్యాఘ్రాలు ఇప్పుడుకూడా బయలు దేరినవి. జపానువారూ, జర్మనీవారూ కలిసి ప్రపంచములోని యితర దేశాలను ఉద్ధరించుట కోసం ఒక గొప్ప వ్రతదీక్ష వహించినామని ఉపన్యాసాలు చెప్పుతున్నారు. ఆసియా ఖండము ఆసియాఖండవాసులకేగాని యూరోపియనులకు కాదనిన్నీ, తూర్పు ఆసియాఖండ రాజ్యాలను యీరీతిగా స్వతంత్ర రాజ్యాలుగా చెయ్యడమే తమ సంకల్పమనిన్నీ, అందుకొరకై యుద్ధము చేయుచున్నామనిన్నీ లోకానికి జపానువారు చాటిస్తున్నారు. భారతదేశానికి స్వాతంత్ర్యం యిప్పించుటకొరకే తాము దీక్షవహించియున్నామని భారతీయులను ఉద్దేశించి చెప్పుతున్నారు. భారతదేశానికి స్వాతంత్ర్యం లభించేవరకు జపానువారు నిద్రపోలేము అనుచున్నారు. భారతీయులమీద వారి కెందుచేత అంత అవ్యాజ కటాక్షం కలిగిందో తెలియడంలేదు. "అయ్యా ! మమ్ములను మీరు ఎట్లాగైనా ఉద్ధరించి ఊర్ధ్వలోకం

# మధ్య ప్రాచ్యంలోని బ్రిటిష్ సేనానులు.



మధ్య ప్రాచ్యములోని బ్రిటిష్ సేనలకు సేనాధిపతియైన జనరల్ సర్ క్లాడు ఆకిన్‌లెక్కుగారు సిరియాలోని బ్రిటిష్ సేనల జోహారును స్వీకరించుచున్నారు. సిరియాలోని యుద్ధమును నడిపించిన బ్రిటిష్ సేనానియగు జనరలు సర్ హెన్రీ మెయిట్లండు విల్సనుగారు ఆకిన్లెక్కుగారి వెనుక వైపున నిలువబడియున్నారు.

---

చూపించండి!" అని భారతీయులు జపానువాళ్లను ఎన్నడైనా అడిగినారా? ఎన్నడూ మాటవరుసకైనా భారతీయులు ఆ మాట వారితో అనలేదు. అటువంటి సందర్భంలో, పిలువని పేరంటంగా వీరువచ్చి, "భారతీయులకు మోక్షమార్గం చూపిస్తాం" అని చెప్పవలసిన అగత్యమేమిటి? భారతదేశాన్ని, ఆసియాఖండ రాజ్యాలను ఉద్ధరించవలెననే వ్రతదీక్ష యీ జపానువారి కెందుకు? "ఇవిగో యీ బంగారు కంకణములు తీసికోండి!" అని వీరు భారతీయులను పిలువవలసిన పని ఏమిటి? ఆ బంగారు కడియాలు స్వీకరించవలెననే ఆశకలిగి తమచెంత జేరితే, ఆ కడియమునే భారతీయులకు తగిలించి, జపానువారు తొడిగిన సంకెళ్లలోనే భారతదేశాన్ని బంధించి ఉంచుకోవలెననే అభిప్రాయం అర్థమౌతూ ఉన్నది. ఫ్రెంచి ఇండోచైనాను రక్షిస్తామని ఆక్రమించి, అక్కడి పంట యావత్తూ జపానువారే 'స్వాహా' అని ఆరగిస్తున్నారు. అరచేతిలో వైకుంఠం చూపిస్తామని వచ్చేటటువంటి దొంగస్వాములు యీ అక్షరాజ్యాలవారు. లోకాన్ని ఉద్ధరించడానికి అవతరించామని చెప్పి, మన మూటలు ముల్లెలు చక్కగా చంకను పెట్టుకొనిపోయే స్వాములు. ఇటువంటి వేదాంతులు వచ్చినప్పుడే మనము మన చెంబు తప్పేల జాగ్రత్త చేసుకోవాలి. ఎవరిముక్తిని వారు సాధించవలసినదేగాని ఇంకొకరు యిస్తే వచ్చేది కాదు. మనమీద అక్షరాజ్యాల కటాక్షం భక్షించడానికేగాని, మనకు మోక్ష మివ్వడానికి కాదు. ఈ అక్షరాజ్యాల రాక్షస తంత్రం గ్రహించి భారతీయులారా! జ్ఞాన చక్షువులను తెరవండి! బాబా! కళ్లు తెరవండీ! ఇల్లు ఒళ్లూ గుల్లచేసే, కల్ల మాటలు వినకండీ!

# జపాను ప్రధాని శ్రీరంగ నీతులు.

బ్రిటిష్ బ్రాడ్‌కాస్టు రేడియోలో మే 13 వ తేదీని జయదేవుగారు జపాను ప్రధాన మంత్రియగు టోజోగారి వాక్యములను విమర్శించుచు యీ క్రింది విషయములను చక్కగా వివరించిరి :—

విశాఖపట్నంమీదను, కాకినాడమీదను జపాను విమానములు బాంబులువేసిన దినమున, జపాను రేడియోలో జపాను ప్రధాన మంత్రియగు టోజోగారు భారతీయులను ఉద్దేశించి ఒక ప్రకటన చేసియుండిరి. భారతీయులందరును, బ్రిటిష్ పరిపాలనను పడగొట్టుటకు పూనుకొనవలసిన దనియు, "భారతదేశము భారతీయులదే" అను భారతీయ సంకల్పమును సాధించవలెననియు, ఆ నాడు టోజోగారు భారతీయులకు స్నేహ పూర్వకంగా సదుపదేశం చేశారు.

ఈ మాటలయొక్క అర్థమేమిటి ? జపానులో సైనిక పక్షమువారిదే సర్వాధికారముగా ఉంది. ఆ సైనిక పక్షమువారి కందరికీ జనరలు టోజో పెద్ద గురుపీరంగా ఉన్నాడు. ఆయన పార్టీ నిర్దాక్షిణ్యమైనది. తమ పార్టీకి ఎదురు చెప్పినవారిని సహించరు. అటువంటి పార్టీకి యీయన కులదైవంగా ఉన్నాడు. టోజోగారికి "మంగలికత్తి" యను మారుపేరుపెట్టి పిలిచే వాడుక దేశంలోఉంది. జనరలు టోజోగారు ఒక వైపున భారతీయులకు తాను చాలా ఆప్త మిత్రునివలె మాట్లాడుతూ ఇంకొక వైపున, ఇండియాపై దండెత్తుటకు ఇండియా సరిహద్దులవద్ద సర్వసన్నాహములను చేస్తున్నాడు. ఆనాడు టోజో చెప్పిన యుపన్యాసములో యీ క్రింది రీతిగా అన్నాడు :—"భారతీయులను జపానువారెన్నడూ తమ శత్రువులుగా భావించడంలేదు. అట్టిది అసంభవం—ఈ యుద్ధ సంక్షోభంవల్ల భారతీయులు కష్టనష్టముల పాలుకాగలరేమో అని కూడా జపాను పరితపించుచున్నది"—ప్రజలందరూ, జపాను విమానదాడులవల్లనూ, బాంబులవల్లను, కొంపలుపోయి, ప్రాణాలుపోయి, గాయాలుతలిగి ఏడుస్తూఉంటే, "మీరు అనుభవించే కష్టముకంటె, మిమ్ములనుచూస్తే నాకెక్కువ కష్టంగాను బాధగాను ఉన్నది" అని చెప్పినట్లుగా ఉంది. ఒక వైపున ఇండియాలోని కోస్తా పట్టణములమీద బాంబులను వేసిరావలసినదిగా తన విమానములకు ఉత్తరువులు జారీచేసి, ఆ నాడే, భారతీయుల క్షేమంకోరిన ఆప్త మిత్రుడను నేనే అని జపాను రేడియోలో ఆ జపాను ప్రధాని చెప్పగలిగెను.

జర్మను నాజీల పద్ధతులన్నీ జపానువారిలో కూడా కన్పించుచున్నవి. చిన్న చిన్న చిట్టి చిట్టి రాజ్యాలైనటువంటి, జెకోస్లోవేకియా, లక్సెంబర్గు, బెల్జియము దేశాలమీదకు జర్మనీ దండెత్తినప్పుడు, తాను ఆ రీతిగా దండెత్తుటకుగల కారణము ఏమని చెప్పియుండెనో చూడండి. జర్మనీ వంటి బలవత్తరమైన రాజ్యంమీదకు లక్సెంబర్గు వంటి చిట్టి రాజ్యం దండెత్తి వచ్చుచున్నట్లుగా జర్మనీకి తోచినదట ! అందువల్ల ఆత్మరక్షణకొరకై, స్వదేశ రక్షణకొరకై ముందుగా తానే లక్సెంబర్గుమీదకూ, జెకోస్లోవేకియామీదకూ, జర్మను సేనలను నడిపించవలసి వచ్చినదట ! 1931 వ సంవత్సరములో చైనామీదకు దండెత్తవలెననే కోరిక తమకెంతమాత్రములేదని జపానువారు చాటించిరి. చైనాలోని మంచూరియా ప్రాంతములోని చైనా ప్రజలు జపానుమీదకు దండెత్తి వచ్చెదరని జపానుకు భయముకలిగినందువల్ల, జపానువారు తమ ఆత్మరక్షణకొరకై మంచూరియాపై కత్తికట్టవలసివచ్చినదని ప్రకటించియుండిరి. మంచూరియాలో జపానువారు అప్పుడుచేసిన యుద్ధం కేవలం ఒక స్వల్ప సంఘర్షణ అని చెప్పుకొన్నారు. కాని మంచూరియా యుద్ధమంతయు ముగిసిన పిమ్మట మంచూరియా జపానువారి వశమైనపిమ్మట, 10 సంవత్సరముల అనంతరం అనగా 1941 వ సంవత్సరములో మంచూరియాయుద్ధవార్షికోత్సవ సందర్భములో మాట్లాడుచు జనరలు టోజోగారు ఏమని అన్నారో చూడండి. "ఆ నాడు మంచూరియాతో జపాను సేనలుచేసిన యుద్ధము స్వల్ప విషయముకాదు. జపానువారు తూర్పు ఆసియా ఖండ సామ్రాజ్యమును స్థాపించుటకు ఆ నాడు పవిత్ర దిగ్విజయ యాత్రను ప్రారంభించియుండిరి."

భారతదేశ విషయంలోకూడా అంతే—భారతదేశాన్ని జయించి ఆక్రమించుకోవలెననేకోరిక జపానుకులేదని ఇప్పుడు జపానువారు అంటారు. కాని జపాను సాగించిన సామ్రాజ్య దిగ్విజయ యాత్రలో భారతదేశ ఆక్రమణకూడా ఒక అంశమైయున్నది.

# భారతదేశ స్వాతంత్ర్యం జపానువారు కోరుతున్నారా!

"ఆసియాఖండం ఆసియాఖండ వాసులదే" అనే మంత్రము నొకదానిని జపానువారు తరచు జపిస్తున్నారు. కాని, జపాను ప్రభుత్వం నిజంగా ప్రజా స్వాతంత్ర్యం కొరకై పరితపించుచున్నదా? అట్లయినచో తమ జపాను దేశములోనే అనేక విద్యార్థులను, విద్యాధికులను జపాను ప్రభుత్వ మెందుచేత జెయిలులో వేసినది? హీరునామా ప్రభువు ఇదివరలో 1929 వ సంవత్సరములో జపాను ప్రధాన మంత్రిగా పనిచేసెను. ఇతడు "కోకుహాన్షా" అనే సంఘమునకు ప్రెసిడెంటుగా ఉండేవాడు. ఇది దేశభక్తుల సంఘమని చెప్పుకొనేవారు. కాని, ప్రజా ప్రతికూల పక్షము వారందరూ ఇందులో చేరియుండేవారు. 1929 సంవత్సరములో హీరనూమా ప్రభువు ఇట్లు చెప్పెను:—"జపానువారియొక్క ముఖ్య లక్షణ మేదనగా, ఔదార్యము. ఈ ఔదార్యము మొట్ట మొదటగా స్వదేశీయులయెడలనే చూపించబడును. అటు పిమ్మట తూర్పు ఆసియాఖండ వాసులపై చూపబడును. అటుపిమ్మట, ప్రపంచములోని మానవకోటి యంతటిమీదను చూపబడును". హీరనూమా ప్రభువు టోకియో విశ్వవిద్యాలయమునకు అధ్యక్షుడుగా కొంతకాలం వ్యవహరించెను. అప్పుడు యీ క్రింది రీతిగా చెప్పెను:— "తీవ్రవాదులైన విద్యార్థులు యీ విశ్వవిద్యాలయంలో పట్టభద్రులుగా తయారుకాకుండా చెయ్యడమే నా సంకల్పము." జపానులో ఎవరైనా, నూతన స్వతంత్రాభిప్రాయమును వెల్లడించినట్లయితే, ఖైదులో ఉంచబడుచున్నారు. ప్రముఖులైన బారిష్టర్లు, డాక్టర్లు ఉపాధ్యాయులు చాలామంది "శాంతి రక్షణ చట్టము" ప్రకారము జెయిళ్లలో వేయబడియున్నారు. ప్రొఫెసరు మినోబీ అనునతడు, జపాను చక్రవర్తికూడా రాజ్యాంగ విధానమునకు లోబడియుండవలసిన వాడే అని వాదించెను. అందువల్ల అతడు ఉద్యోగములోనుంచి బర్తరఫు చేయబడెను. జపాను చక్రవర్తి న్యాయ చట్టములకు అతీతుడనియు, దేవాంశ సంభూతుడనియు (టెన్నో అనియు), అమాటెరాసూ అను దేవతయొక్క వంశీకుడే యనియు, చక్రవర్తి సర్వతంత్ర స్వతంత్రుడైన నిరంకుశాధికారి యనియు, చక్రవర్తిని పూజించవలెననియు ప్రభుత్వాధికార పక్షమువారు వాదిస్తూ ఉంటారు. ఆ చక్రవర్తి పేరుతో తామే నిరంకుశాధికారం సాగిస్తూ ఉంటారు. జర్మనీలో హిట్లరు నిరంకుశాధికారం చలాయించిన రీతిగానే జపాను మంత్రివర్గంకూడా జపాను చక్రవర్తిపేరిట నిరంకుశాధికారం చలాయించుచున్నది. జపానులోని కార్మికులకు జీవనోపాధికి తగిన కూలి రేట్లు కావలెనని జపానులోని కార్మిక నాయకులు ఆందోళన చేసినందుకై ఆ నాయకులు జర్మనీలో శిక్షింపబడినట్లుగానే జపానులోకూడా శిక్షింపబడిరి. జర్మను ప్రభుత్వ పద్ధతిని ప్రభుత్వ ధోరణిని మెచ్చుకొనుచు వ్రాయబడిన గ్రంధములనే జర్మను విద్యాధికారులు పాఠశాలలందు ఏ విధముగా విద్యార్థులచేత చదివిస్తున్నారో, అదేవిధంగా, జపానులోకూడా జపాను ప్రభుత్వ పద్ధతిని కొనియాడే పుస్తకములను చదివిస్తున్నారు. గత 30 సంవత్సరములోను కొరియా ప్రజలను జపానువారు క్రూరంగా హింసించి వారిని పీల్చి పిప్పి చేస్తున్నారు. చైనాలో జపానువారు ఆక్రమించిన ప్రాంతాలలోని ప్రజలను అనేక బాధలు పెట్టుచున్నారు.

1937 వ సంవత్సరములో సర్ రవీంద్రనాథ టాగూరుగారు యిట్లు వ్రాసిరి:—

ఆత్మరక్షణా సామర్థ్యంలేని అసహాయులైన ప్రాచ్యరాజ్యాల ప్రజలకు జపానువల్ల గొప్ప ఉపద్రవము కలిగేటట్లుగా కన్పించుచున్నది. జపానువారి రాజ్యకాంక్షకంటెను, ద్రవ్యకాంక్షకంటెను ఘోరమైన దేదనగా, జపానువారు చేయుచున్న జనసంహారం! ఆ జనసంహారమును సిగ్గులేక వారు సమర్థించుకొనడం!!

# మద్రాసు సైనికుల నష్టము.

వేర్వేరు తేదీలయందు మద్రాసు సైనికులలో యీ క్రింద ఉదహరింపబడిన జన నష్టము కలిగినదని తెలియజేయుటకు చింతిల్లుచున్నాము :—

## మద్రాసు సాపర్లు, మైనర్లు

### మరణించినవారు.

| నెంబరు. | హోదా. | | పేరు. |
|---|---|---|---|
| 13188 | సాపరు | ... | అప్పలస్వామి |
| 17362 | సాపరు | | సీలయ్య. |
| | ధోబీ | .. | రామస్వామి. |
| 17500 | సాపరు | ... | చిన్నప్పన్. |
| 62840 | సాపరు | . . | పెరియసామి. |

### గాయములచే మరణించినవారు.

| నెంబరు. | హోదా. | | పేరు. |
|---|---|---|---|
| 62068 | సాపరు | ... | పొన్నుసామి |
| 19115 | సాపరు | ... | రాజా రావు. |

### గాయపడినవారు.

| నెంబరు. | హోదా. | | పేరు. |
|---|---|---|---|
| 17845 | సాపరు | ... | అబ్దుల్ జబ్బారు. |
| 60867 | సాపరు | ... | గోవింద రాజు. |
| 1132 | డబ్లియు/సి | ... | కన్నన్. |
| 62039 | సాపరు | ... | మహమ్మద్. |
| 15577 | నాయక్ | ... | మునిసామి. |
| 17230 | లాన్సు హవల్దార్ | | రామదాస్. |
| 62024 | సాపరు | ... | షేకు చిన్న మస్తాన్. |
| 17843 | నాయక్ | | థామస్. |
| 62004 | సాపరు | ... | సుబ్రమణి. |
| 19437 | సాపరు | ... | గురుసామి. |
| 60339 | సాపరు | .. | డి. నారాయణ. |
| 16170 | లాన్సు నాయక్. | | షేకు హుస్సేను. |
| 14617 | సాపరు | . . | దురైసామి. |
| 12734 | సాపరు | .. | దయానుకోలి. |
| 42418 | సాపరు | ... | హరిసింగు. |
| 62000 | సాపరు | ... | కన్నుస్వామి. |
| 19544 | సాపరు | . | కేశవులు. |
| 19365 | సాపరు | ... | కృష్ణా రెడ్డి. |
| 61240 | సాపరు | ... | కుప్పన్. |
| 19505 | సాపరు | ... | నరసింహులు |
| 11912 | సాపరు | ... | రామ భాన్స్లే. |

### కనిపించనివారు.

| నెంబరు. | హోదా. | | పేరు. |
|---|---|---|---|
| 19513 | సాపరు | ... | అంథోనీ. |
| 17529 | సాపరు | . | అప్పాసామి. |
| 62716 | సాపరు | ... | ఆరుముగన్. |
| 16184 | సాపరు | ... | చిన్నప్ప. |
| 1547 | ఇండియను పటాలముల వంటవాడు. | | చిన్నప్పన్. |
| 14243 | లాన్సు నాయక్. | | చిన్నసామి. |
| 61282 | సాపరు | ... | దస్తగీర్. |
| 19683 | సాపరు | ... | దొరైసామి. |
| 19377 | సాపరు | ... | దొరైసామి. |
| 17232 | సాపరు | ... | గోపాల్. |
| 18443 | సాపరు | ... | జోషువా, జి. సి. యన్. |
| 62051 | సాపరు | ... | కణ్ణన్. |
| 60999 | సాపరు | ... | కె. బుచ్చయ్య. |
| 1415 | ఇండియను పటాలముల వంటవాడు. | | కేలు నాయర్. |
| 62079 | సాపరు | ... | కృష్ణన్నాయర్. |
| 62080 | సాపరు | ... | మోజెస్. |
| 14998 | సాపరు | ... | మునిస్వామి. |
| 17010 | నాయక్ | ... | మునిస్వామి. |
| 19478 | సాపరు | ... | మునిస్వామి. |
| 16594 | సాపరు | . . | మురుగేశను. |
| 19617 | సాపరు | ... | నారాయణస్వామి. |
| 15553 | సాపరు | ... | పెరుమాళ్. |
| 16603 | సాపరు | ... | పెరుమాళ్. |
| 19491 | సాపరు | ... | శంకరలింగం పిళ్లై. |
| 19627 | సిపాయి | ... | షేకు హరీఫుల్లా. |
| 16682 | సాపరు | ... | సూసాయి. |
| 19953 | సాపరు | ... | సుబ్రమణ్యన్, టి. సి. |
| 60352 | సాపరు | ... | తంబయ్యన్. |
| 62010 | సాపరు | ... | ఉత్తమన్. |
| 18909 | సాపరు | ... | యాగం. |

MADRAS: PRINTED AND PUBLISHED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.